ఆంధ్ర పత్రిక
ఆదివారం 1949 జూలై 24.

# గ్రంథ పరిచయము

# భారతదేశ రాజ్యాంగ చరిత్ర

## శ్రీ ఆత్మకూరి. గోవిందాచార్యులు "రాజ్యాంగ భారతము" సమీక్ష

## (శ్రీ దిగవల్లి వెంకటశివరావు)

... ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారిచే ప్రకటింపబడిన భారతదేశ రాజ్యాంగ చరిత్ర. మూడు సంపుటములు రాయల్ సైజులో 1588 + 100 పుటలు. వెల 3 ఖండములు 35 రూపాయలు.

ఆంధ్ర విశ్వకళా పరిషదధ్యక్షులైన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి ఆదరాశీర్వాద పురస్సరమైన తిలకరచనతో, కృతిభర్తయైన కాంగ్రెస్ అధ్యక్షులు—శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి పీఠికతో, ఆచార్య గోగినేనిరంగా-ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య, శ్రీ లక్కరాజు సుబ్బారావుగార్ల సదభిప్రాయములతో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారికి 39వ ప్రచురణముగ వెలువడిన యీ భారతదేశ రాజ్యాంగ చరిత్రకు ఆగర్భ శ్రీమంతుని పుత్రునికివలె పుట్టుకతోనే గొప్ప అంగరక్షులు, బాలసారె, నామకరణ మహోత్సవము చేకూరినవి.

గ్రంథకర్తగారు తా మీ గ్రంథమును రచించుటలోని లక్ష్యలక్షణములను వివరించినారు. (1) భారతీయ రాజ్యాంగ శాసనపరివర్తనము (2) బ్రిటిషు పరిపాలనా పరిణామము (3) స్వరాజ్యోద్యమ విజృంభణ విధానము, వర్తమాన పరిస్థితులు నీ మూడింటి సమన్వయచరిత్రయే సంపూర్ణ భారత రాజ్యాంగ చరిత్రయని శ్రీ ఆచార్యులవారు సెలవిచ్చినారు.

"ఇండియన్ పాలిటీ 1600—1948" అని దీని కింగ్లీషులో నామకరణము చేయబడినది. పాలిటీ అనగా ప్రభుత్వవిధానము, సంఘవ్యవస్థ, రాజ్యాంగవ్యవస్థ అని అర్థము.

ఈ గ్రంథము ఆదిమధ్యాంతఖండములను మూడు భాగములుగను, 18 పర్వములుగను అనేక పరిచ్ఛేదములుగను పేరాలుగను విభజింపబడియున్నది.

గ్రంథకర్తగారు లక్ష్యలక్షణములుగా సూచిన ప్రకారము మూడు విషయములను సమన్వయము చేయలేదు. ఈ మూడు విషయములు నీళ్లకు నీళ్లు ప్రసాదమునకు ప్రసాదమువలె నున్నవి. ఇంతేకాదు. సమన్వయము లేనందువలన విషయ విభాగము చెడి రాజకీయ రాజ్యాంగ పరిణామము సుబోధకము గాకున్నది. చరిత్రాంశములు తిలతండుల న్యాయముగ పదజల్లబడినవి. పరిపాలనా విధానము శాసన పరివర్తనముతోగాని, రాజ్యాంగ పరిణామము స్వరాజ్యోద్యమముతోగాని అతుకుట లేదు.

ఒకే విషయమునకు సంబంధించిన వివిధాంశములను జీర్ణము చేసికొని పూసగుచ్చినటుల వివరింపక పోవుటవలన చర్వితచర్వణములు, పునరుక్తులు ప్రబలియున్నవి ఉదాహరణమునకు మొదటి పర్వములో 122వ పుట మొదలు 251 వరకు రిస్యులేటింగు శాసనము పిట్టు శాసనము ఇండియా కౌన్సిలు పరిపాలన 1786-1793 కారన్ వాలీసు పరిపాలన, ఆయన చేసిన సంస్కరణములు-1813-1853 వరకు పార్లమెంటు శాసనములు; 1797 సం॥ శాసనము కారన్ వాలీసు; 1800-1823 శాసనములు; పరిపాలనా విధానము 1793-1813-1833-1853, భూమి శిస్తుల నిర్ణయము న్యాయశాఖ వంగదేశ పరిపాలనము కారన్‌వాలీసు అను శీర్షికలక్రింద వ్రాయబడిన విషయములు కలగాపులగముగ నున్నవి. దీనిని సామాన్య పాఠకులు సమన్వయము చేసికొన జాలరు.

ఈ విషయముల మధ్య 158 వ పుట మొదలు 204 వ పుట వరకును కంపెనీవారి సామ్రాజ్య స్థాపనము అను పెద్ద అక్షరముల శీర్షక క్రింద 78 పేరాలుగల రాజకీయ చరిత్ర వివరింపబడినది. ఇట్టి రాజకీయ చరిత్రాంశములు, శాసన విషయములు కారన్ వాలీసు పరిపాలనకు సంబంధించిన విషయములు నొకదానితో నొకటి సమన్వయములేక అతుకులతో నిండియున్నవి. సామాన్య పాఠకులకు తుద మొదలు తెలియ వీలులేనంత చిక్కుగా అల్లబడినవి. అందువలన విషయ విభాగము పూర్తిగా చెడినది. 32 వ పేరాకువలెనే 33 వ పేరా మొదలు 36 వ పేరా వరకును ప్రతి పేరా పైనను పెద్ద అక్షరములతో శీర్షికలు ముద్రింపబడినవి. 37 వ పేరాకు మాత్రము "ప్రీవీకౌన్సిలు" అని చిన్న అక్షరముల శీర్షిక నొసగబడినది. దీని తరువాత 19 మొదలు 22 వరకు వరుస నెంబర్లతో కంపెనీయొక్క సైనిక దశలు; క్రైస్తవమతము విద్య సంఘ సంస్కరణము పరిపాలనా ఫలితములు, సింహావలోకనము అను పెద్ద అచ్చు శీర్షికలతో కొన్ని విషయములను వ్రాసి మొదటి పర్వము ముగించినారు.

ఇట్లే రెండవ పర్వమునందు 1858 మొదలు 1935 వరకు గల రాజకీయ రాజ్యాంగ చరిత్రలను వ్రాయుటలో గ్రంథకర్తగారు విషయ విభాగమునందొక పద్ధతి నవలంబింపలేదు. రెండవ పర్వము యొక్క విషయసూచికనుబట్టి

(12 వ పేజీ చూడుడు)

పార్టిల పట్టి ...

1. వాది
దిగవల్లి వేంకటశివరావు
వాది అడ్రసు C/o Sri V. V
2. ప్రతివాదులు
1. పొనుగుపాటి సుబ్రహ్మణ్య
2. యీ మాణిక్యాంబ
3. పొనుగుపాటి పేరరాజుపంత
4. చిరట్ల రుద్రయ్య
5. కందిర్లి నారాయణమూర్తి
6. యీ కృష్ణమూర్తి
7. యీ శ్రీరాములు
5 to 7 మైII గాII తల్లి పెద
8. దేవరకొండ సుబ్బమ్మ
9. వెల్లంకి వెంకటసుబ్బారా
10. యీ వెంకటరావు
11. యీ రామమూర్తి
12. యీ చినసుబ్బారావు
13. యీ లింగమూర్తి
14. మాదిరెడ్డి రామన్న
15. యీ వెంకటరాజు
16. యీ అన్నపూర్ణమ్మ
17. నలమాటి సుబ్బారావు
గాII పితామహి రమణ
18. చామర్తి గోపాలకృష్ణం
19. యీ శివరామకృష్ణయ
20. యీ వెంకటరావు
21. రాయపాటి యషయ్య
22. నరసింహారావు జాక్
23. కంచర్ల వెంకటేశ్వర
24. యీ చలమయ్య
25. యీ శ్రీరాములు

# "రాజ్యాంగ భారతము"

(10వ పేజీ తరువాయి)

చూచిగా ఇది 55 భాగములుగా విభజింప బడినట్లు కనబడుచున్నది. అయితే పర్వము లోపల చూచగా నిందులో 17 భాగములకు పెద్ద అక్షరముల శీర్షిక లొసగబడి తక్కిన భాగములను పేరాలుగా జేసి వానికి చిన్న అచ్చు శీర్షిక లొసగబడినట్లు కనబడుచున్నది. అయితే కొన్ని పేరాలకు కూడా పెద్ద అచ్చులో శీర్షిక లొసగబడినట్లు కనబడుచున్నది.

రెండవ పర్వమునందలి ముఖ్యభాగములలో (5) 1858 సం॥ రాజ్యాంగ శాసనము. (6) శాసనసభల శాసనము (7) విప్లవాంకురములు (8) స్వరాజ్యాందోళన ప్రారంభము (10) 1892 రాజ్యాంగ శాసనము నాటి రాజనీతి (11) నిర్బంధ విధాన విజృంభణము (12) వంగదేశ విభజనము (13) మింటోమార్లే సంస్కరణములు నాటి రాజనీతి (14) ఐరోపా మహాసంగ్రామము (15) మాంటేగూ సంస్కరణములు అనునవి పెద్ద అచ్చుశీర్షికలు గల పరిచ్ఛేదములు (27) సహాయ నిరాకరణము (40) జాతీయోద్యమ విజృంభణము (41) సత్యాగ్రహ సమరము (52) కాంగ్రెస్ సభా పునరుజ్జీవనము అనునవి పెద్ద అక్షరముల శీర్షికలుగల పేరాలు! 272 వ పుటలో "పార్లమెంటులో" 319 వ పుటలో దేశీయ మహాజనసభ లేక కాంగ్రెసు 339 పుటలో "హార్డింజిమీద బాంబు విసరుట;" 392 వ పుటలో స్వరాజ్యపక్ష నిర్మాణము అను పెద్దఅక్షరముల శీర్షికలు పరిచ్ఛేదములును కావు పేరాలును కావు. అవి ప్రత్యేకభాగములే. తక్కిన భాగములు పెద్దఅచ్చు శీర్షికలక్రింద వరుస నెంబరులతో చిన్న అక్షరముల శీర్షికలతో వ్రాయబడిన పేరాలు. అయితే ఈపేరాల లోని విషయములు అప్రధానములని అముఖ్యములని అనుకొందమన్నచో అట్లుగాక పెద్దఅక్షరముల శీర్షిక లొసగబడిన వానికన్న నివి చాల ముఖ్యమైన రాజ్యాంగ చరిత్రాంశములుగ నున్నవి!

విదేశములలో భారతీయుల పరిస్థితి—హోంరూలు ఉద్యమము-రౌలటు సత్యాగ్రహము—కాంగ్రెస్ లీసుస్కీము—పంజాబు హత్యలు—సర్వపక్ష సమావేశము—*National Demand*—గాంధీ ఇర్విన్ ఒడంబడిక—రౌండు టేబిలు సమావేశములు—~~...~~ కమిటీ విచారణ శ్వేతపత్రము—మొదలైన గొప్పగొప్ప విషయముల నిట్లు పేరాలలో చిన్న అక్షరముల శీర్షికలక్రింద నుంచుటలో శ్రీ ఆచార్యులవారి యుద్దేశము బోధపడుటలేదు.

ఈ పర్వమునందు శ్రీ ఆచార్యులవారు విప్లవాంకురములు స్వరాజ్యాందోళన ప్రారంభము. దేశీయ మహాజనసభ లేక కాంగ్రెస్ అని పెద్దఅక్షరములతో ముద్రించిన శీర్షికల క్రింద 316 వ పుట మొదలు 321 వ పుట వరకుగల విషయములను పరిశీలించినయెడల ఈ పరిచ్ఛేదము లెంత అజాగ్రత్తగ వ్రాయబడినది కనబడును. "విప్లవాంకురము" లను శీర్షిక క్రింద విప్లవాంకురములు కానరావు. స్వరాజ్యాందోళన ప్రారంభమున నార్తుబ్రూకుగారి వాక్యములు కొన్ని వ్రాయబడినవి. (ఈపేరు 319 లో "విస్కవుంటు కాన్ బ్రూకు" అని అపభ్రంశముగ ముద్రింపబడినది. లిట్టన్ గారి పరిపాలనమొక పేరాలో ముగింపబడినది.) దేశీయ మహాజనసభను స్థాపించు నుద్దేశముతో హ్యూముగారు విద్యార్థులకు వ్రాసిన లేఖ నుదాహరించుటతో కాంగ్రెసు స్థాపన చరిత్ర ముగిసినది!

ఈ విషయము ఇక్కడ సంతృప్తికరముగా నుదహరింపబడకపోవుటకుగల కారణము ఆచార్యులగారు అనువదించిన మూల గ్రంథముయొక్క తప్పుగాని ఆచార్యుల వారి తప్పుకాదు. భారత దేశ రాజ్యాంగ పరిణామ చరిత్రకెల్ల మూలమైన విప్లవాంకురములు స్వరాజ్యోద్యమా[illegible]ను కాంగ్రెసు స్థాపనమును గూర్చిన విషయము సందర్భానుసారముగ వివరింపక వదలితిమని శ్రీ ఆచార్యులవారు గ్రహించి ~~[illegible]~~ అంత్య ఖండమునందు "మత సాంఘిక రాజకీయ సంస్థలు" అను 17 వ పర్వమునందును, "విప్లవోద్యమము వీరపూజ" అను అనుబంధమునందును [illegible], నీ విషయము లెత్తుకొని వ్రాసినారు. గాని అక్కడగూడా నీ యంశములు సంతృప్తికరముగా వివరింపబడలేదు.

17 వ [illegible] "నూత్న సంచలన స్వరూపము"ను శీర్షికతో నొక పేరాను ప్రారంభించి, రెండవ పేరాకు "1833 మొదలు 1885 వరకు జాతీయోద్యమము" అను శీర్షిక నొసగి దానిక్రింద 'దేశీయ మహాజన సభా స్థాపనోద్దేశ్య మెవరికో నాడుదయించినది కాదని ప్రారంభించి రామమోహనరాయల దగ్గరనుండి దయానందుని దగ్గర కొక్క గంతువేసినారు ఆచార్యులవారు!

1828 మొదలు 1878 వరకు కాంగ్రెస్ స్థాపనకు పూర్వము ఏబదేండ్ల క్రిందట నుండి భారతదేశమున వివిధ రాష్ట్రములందలి ప్రజానాయకులు దేశప్రజలలో ఆంగ్ల విద్యాభివృద్ధిని గావించుటకు, రాజకీయ పరిజ్ఞానము కలిగించుటకును ప్రజా సంఘములు స్థాపించి దేశోద్ధరణ చేయుటకును రాజ్యాంగ సంస్కరణములను గావించుటకును చేయబడిన కృషి చరిత్రను గూర్చియు, అందువలన ప్రజలలో గలిగిన జాతీయ చైతన్యమునుగూర్చియు ప్రజల రాజకీయోద్యమమును గూర్చియు తత్ఫలితముగా ఇంగ్లీషువారు గావించినరాజ్యాంగ సంస్కరణలను గూర్చియు ఆంధ్రులు [illegible]గారి కాంగ్రెస్ చరిత్రయందు ఉదహరింపబడిన విశేషములను శ్రీఆచార్యులవారేలకో ఉదాహరింపక విడిచినారు. బహుశా శ్రీ పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెస్ చరిత్రలో లేదని వదలినారేమో.

ఆచార్యులవారు విప్లవోద్యమము అను అనుబంధమునందుకూడ మహారాష్ట్ర దేశము లందు బయలుదేరిన విప్లవోద్యమారంభ చరిత్రలనుగూర్చియు రౌలటు నివేదిక లోని విశేషములనుగూడ ఇట్లే వ్రాయక ఉపేక్షించినారు. దీనివలన రాజ్యాంగ చరిత్రయందు గొప్ప లోపము కనబడుచున్నది.

భారత దేశమున 1858 సంవత్సరము నుండి 1935 సంవత్సరము వరకును అమలులో నుండిన "భారత రాజ్యాంగ యంత్రము" యొక్క స్వరూప స్వభావములను శ్రీ ఆచార్యులవారు ఆదిఖండము చివరగల 3 వ పర్వమునందు 480 పుట మొదలు 541 పుట వరకును వ్రాసినారు. మధ్యఖండమునందు 545 పుట మొదలు 1139 పుట వరకు 1935 సంవత్సరం రాజ్యాంగ శాసనమునుబట్టి ఇంగ్లీషు పార్లమెంటువారు నిర్మించిన రాజ్యాంగ స్వరూప స్వభావములను దానికి సంబంధించిన అనేక విషయముల విమర్శలు, చర్చలు వివరింపబడినవి. ఇందులో 1935 వ సంవత్సరం రాజ్యాంగ శాసన లక్షణము చక్రవర్తి రాజ్యాంగము-రాష్ట్ర పరిపాలనము—సమాఖ్య ప్రభుత్వ పరిపాలనము—ప్రభుత్వశాసనాధికారము కేంద్ర రాష్ట్ర సంస్థాన ప్రభుత్వములు. న్యాయ పరిపాలన శాఖ. ప్రభుత్వ సిబ్బంది, ప్రభుత్వకోశము, భారతీయ సంరక్షణము స్వదేశ సంస్థానములు, అను భాగముల నొక్కొక దాని నొక్కొక పర్వముగా చేసినారు.

కొంత చేజిక్కించుకొని అక్రమ

nd చేయతగిన legal necessity

నారయ్యగారు ఒక వీలునామాను

దికల్లిగారికి దఖలు పడినట్లున్నూ

-1906, ది 6-2-1907 తేదీలు గల

మా వ్రాయించినట్లు నమ్ముటకు

గారికి మతిసిమితము లేనట్లున్నూ

నిమిత్తము సదరు సింహామ్మగారికి

యినగా కూడా వాదితల్లిగారు సదరాస్తులను విక్రయిస్తూ వున్నట్లున్నూ పొందలేన అబదపు సంగతులను కూడా

సదరు దస్తావేజులలో నుదహరింపజేసినట్లున్నూ అంతేగాక [illegible]

ఇట్లు రాజ్యాంగ భారతమునందు 14 పర్వములు ఆది మధ్య ఖండము ... పూర్తి చేయబడినవి. అల్పసంఖ్యాకుల సమస్య, మత సాంఘిక రాజకీయ సంస్థలు, 1945-1947 మధ్య చరిత్ర, 1935 సంవత్సరం రాజ్యాంగ శాసనము అమలు, అను శీర్షికలు గల 4 పర్వములును విప్లవోద్యమము, వీరపూజ, హిందూ మహమ్మదీయ సంఘ పూర్వ స్వరూపము—జాతీయత, సంక్షిప్తము, *Bibbiography*, స్వరాజ్యరాజ్యాంగము అను అయిదు అనుబంధములును కలిపి 1141 పుట మొదలు 1588 పుట వరకుగల అంత్యఖండము అను పేరు గల మూడవ భాగముతో నీగ్రంథము పూర్తి అయినది.

"బెరీడేల్ కీత్" అను ఇంగ్లీషు విద్వాంసుడు భారతదేశ రాజ్యాంగ చరిత్రను గూర్చి ఇంగ్లీషులో వ్రాసిన గ్రంథమును శ్రీ పట్టాభి సీతారామయ్యగారు వ్రాసిన కాంగ్రెసు చరిత్రను ముఖ్యాధారములుగ గైకొని ఇతర గ్రంథములలోని కొన్ని భాగములనుకూడ వానికి చేర్చి ఆచార్యులవారీ గ్రంథరచన సాగించినట్లు కనబడుచున్నది.

శ్రీ ఆచార్యులవారు చాల కష్టపడి అనేక గ్రంథములలోని విషయములను సమకూర్చి వానికి తర్జుమాలు చేసినారు. తుదకు 1935 సం॥ రాజ్యాంగ శాసనమునకు జతపరుపబడిన కేంద్ర రాష్ట్రీయ ఉభయ శాసనసభల శాసనాధికార విషయముల పట్టికలు ఇతర జాబితాలుకూడా తెలుగు చేసినారు. అయితే తాము వ్రాసియుంచుకొనిన వివిధ విషయములను మరల పరిశీలించి వివిధ దృక్పథములతో వ్రాయబడిన అనేకాంశములను సమన్వయము జేసికొని గ్రంథమును రచింపలేదు.

ఆచార్యులవారీ గ్రంథమునందు 1935 సం॥రం రాజ్యాంగ శాసనమునకు అనవసరమైన ప్రాధాన్యత నిచ్చినారు. ఆశాసన విషయములు దానినిగూర్చిన విమర్శలు కొన్ని వందల పుటలు మ్రింగినది. అందలి ఒక్కొక్క విషయ మొక్కొక పర్వమైనది. ఆచార్యులవారీ భాగమును పదేండ్ల క్రిందట రచించినారు. మనదేశ రాజకీయ పరిస్థితులు తారుమారైనవి. మన రాజ్యాంగ నిర్మాణ సభవారిప్పుడా రాజ్యాంగ శాసనముతో సంబంధములేని స్వతంత్ర రాజ్యాంగనిర్మాణము చేయుచున్నారు. అందువలన నా శాసనమును గూర్చిన దీర్ఘ విమర్శ లిప్పుడు అప్రస్తుతములును అనవసరములునై యున్నవి.

ఆచార్యులవారీ గ్రంథమునందు చరిత్రాంశములకన్న చరిత్రాంశములనుగూర్చి చరిత్రకారు లొసగిన అభిప్రాయములకును వానినిగూర్చి రాజకీయ నాయకులు చేసిన విమర్శలకును ఎక్కుడు ప్రాముఖ్యత నిచ్చినారు. అందువలన చరిత్రరచనలో పునరుక్తులుండుటయును ఒకే అంశము రెండు చోటులలో రెండు తీరులుగా వివరింపబడుటయును తటస్థించినది.

గ్రంథమునందు కొన్ని పెద్ద పొరబాటులు కనపడుచున్నవి. మొదటి పర్వమునందు "క్రైస్తవమతము విద్య సంఘ సంస్కరణము" అని శీర్షిక క్రింద వ్రాయబడిన అంశములలో కొన్ని మరల అంత్యఖండమున ఆంగ్లేయ విద్యావిధానము అను శీర్షికతో రచింపబడిన 15వ పర్వమునందు చేర్చబడినవి. ఏకరువు పెట్టబడినది. 271 పుటలో నుదాహరింపబడిన మెకాలే తండ్రికి వ్రాసిన లేఖ 1178 పుటలో మరల నుదాహరింపబడినది.

క్రైస్తవమత ప్రచారమును గూర్చి 267-272 పుటలలో వ్రాయబడిన సంగతులు 1180 పుటలో వ్రాసిన విషయములకు కేవలము విరుద్ధములుగ నున్నవి.

ఇట్టి ఇంగ్లీషు వాక్యముల తర్జుమాలు కొన్నికొన్ని చోట్ల విపరీతార్థ ప్రతిపాదకములగుచున్నవి.

1935 సంవత్సరం రాజ్యాంగచట్టమును గూర్చి కీతుగారి అభిప్రాయమును వివరించుచు ఆచార్యులుగా రిట్లు వ్రాసిరి.

"ప్రభుత్వమువారు రెండు కలియుటకు వీలులేని వస్తువులు కలుపుటకై యత్నించిరి" (చూ. 555 పుట).

కలియుటకు వీలులేని రెండు వస్తువులను కలుపుటకై యత్నించిరని వారి భావము కాబోలు!

"హిందూమత సంరక్షణము వీడబడి (పుట 269) ఈ మతసంరక్షణ మెట్టిదో!

"కాని సతిని నిషేధించుట దుస్తరమైనది" పుట 269.

"సహగమనమును నిషేధించుట దుస్తరమైనదని వారి యుద్దేశ్యము!

రామమోహనరాయ్ విపరీత కృషిచేసియుండెను. (270 వ పుట).

అత్యధిక కృషియని వా రుద్దేశించిరి గాబోలు!

సిపాయిల కలహము. (పుట 1094).

సిపాయిల తిరుగుబాటు లేక విప్లవమని వారి యూహ.

"సాంకేతికశబ్ద ప్రయోగ నిర్వచనము" అను శీర్షిక క్రింద 85 వ పుట మొదలుకొని వ్రాయబడిన వివరణలు తిన్నగా అర్థమగుటలేదు.

"*In his discretion*" స్వేచ్ఛతో లేక స్వయం నిర్ణయము (పుట 86) *He is expected to act on the advice of the Council of Ministers* అనగా మంత్రివర్గ నిర్ణయమును పాటించుట. స్వేచ్ఛతో ఆలోచనానంతర స్వేచ్ఛతో వ్యక్తిగత నిర్ణయాధికారముతో యీ మూడువిధములగు కార్యములతో గలిపి గవర్నరులు లేక గవర్నరు జనరలుయొక్క అధికారమును చెప్పబడినచోట్ల మంత్రుల సలహా ననుసరించియే కార్యనిర్వహణ మొనరింపవలయునను విధి గలదు." అని క్రింద నొక ఇంగ్లీషు వాక్య ముదాహరింప బడినది. దానికిని దీనికిని సంబంధము గనబడుటలేదు. ఇట్లే తక్కిన సాంకేతిక శబ్దప్రయోగముల నిర్వచనమును అర్థరహితముగ నున్నది.

కేంద్రప్రభుత్వము - సమాఖ్య ప్రభుత్వము అను శీర్షిక క్రింద 88 పుట మొదలు 97 పుట వరకూ పారిభాషిక పదములు గల జాబితా యొకటి ముద్రింప బడినది. ఇవి శ్రీ ఆచార్యులవారు నిర్మించిన సాంకేతికములు. ఇందలి పదములలో కొన్ని చిత్రముగా నున్నవి.

*Secretariat*: సచివాలయము.

*Leader of the House*: సభానేత సభాగ్రహి.

*Speaker*: శాసనసభ ప్రధాని లేక నియామకుడు.

*President of the Council*: పరిషత్ ప్రధాని.

*Panel of Chairmen*: సభాపతుల పట్టిక.

*Honourable Member*: మాననీయ సదస్యుడు.

*Supplementary Question*: ప్రత్యుత్తర ప్రశ్న *Lobby*: సభా కక్ష.

*Governors Box*: రాష్ట్రపతి ప్రకోష్టము.

*Clerk*: లిపిక, గుమాస్తా.

*Civil administration*: జానపద ప్రశాసనము.

*Ordinance*: ప్రత్యాదేశము.

*Validation*: విధికరణము.

*Oath of allgiance*: దీక్షా ప్రమాణము, భక్తి శపథము.

*Loyalty*: భక్తి.

*Provisional expenditure*: అస్థాయీ వ్యయము.

*Non-votable expenditure*: అనామోదక వ్యయము.

*Appropriation account*: అంకణా నియోజిత వ్యయము.

*Supplementary Budget*: అనుపూర్వకావయ వ్యయ పత్రిక.

*Form*: రూపము, మోస్తరు.

*Speech*: సంభాషణ.

*Constituency*: నియోజన క్షేత్రము. (నియోజక వర్గము మాటలేదు.)

*Guillotine*: ముఖ బంధము.

ఇంతకన్న సరళమైన పర్యాయ పదములనో లేదా ఆయా ఇంగ్లీషు పదములనో వాడియుండినచో బాగుండెడివి బిల్లు, బాంకు, రిజిష్టరు, ఓటు, మోటారు, మొద

ఆంధ్రపత్రిక 24.7.1949.

లైన ఇంగ్లీషు పదములను ధారాళముగా వాడిన ఆచార్యులుగారు ఇటువంటి కఠినములైన పర్యాయ పదములను నిర్మించుట కెందుల కింత శ్రమపడవలయునో తెలియుటలేదు.

మన చరిత్రలోని స్త్రీ పురుషులను గ్రంథములందు ప్రయోగింపబడిన అపభ్రంశ రూపములేగాక ఇంగ్లీషులోనుండి తెలుగు చేయునప్పు డుచ్చారణభేదమువలన వెలసిన వికృతరూపములు నీ గ్రంథమునందు చాల కనబడుచున్నవి.

షా అలంకు బదులు షా అలెం.

దినకరరావుకు బదులు డెంకరరావు.

డిస్రేలీకి బదులు డిసరాలీ.

పామర్‌స్టన్‌కు బదులు పామెర్స్టన్. పాలెమెర్‌ట్సన్.

వెల్లస్లీకి బదులు వెల్సలీ.

గన్నర్ పార్టీకి బదులు గాడరు పార్టీ మొదలైనవి ఎన్నో కనబడుచున్నవి.

ఈ గ్రంథమునందు ఇంగ్లీషు మాటల స్పెల్లింగు తప్పులును తెలుగు మాటల వర్ణక్రమముల తప్పులును చాల కనబడుచున్నవి. అచ్చు తప్పులేని పుటయే లేదనుటలో నతిశయోక్తి లేదు.

1408—9 పుటల మధ్య ముద్రింపబడిన స్వతంత్ర భారతదేశ పటములో వంగ రాష్ట్రము నందొక భాగము "పశ్చిమ బెంగాల్" అనియు, రెండవ భాగము తూర్పుపంజాబ్ (పాకిస్తాన్) అని కూడ వివరింపబడినది! సుప్రసిద్ధులైన గ్రంథకర్తచే రచింపబడి ఆంధ్ర విశ్వకళా పరిషత్తు రిజిష్ట్రారుచే ప్రకటింపబడిన ఈ గ్రంథమునం దన్ని దోషములుండుట చాల శోచనీయము.

...ు ఖ ము న కు :—

...రాలు.

...ని వాదికి స్వాధీనపడ

తూర్పు వడ్డిపర్తి శేషమ్మ యీనాం,

దక్షిణం జమీందారీ జిరాయితీ,